శ్రీరస్తు.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# వ[illegible]రాయణ శతకము



వెస్టువార్డు అండు కంపెనీ వారి

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపబడినది.

చెన్నపురి.

 1953 వెల 0-4-0.

శ్రీరస్తు.

# పెద్దనారాయణశతకము.

మత్తకోకిలలు.

శ్రీగంగధారులుబుట్టినా శ్రితరక్షపాదము లంచునీ । యోగంబులేభజనంబులై యొనరింప దేవరవారికిన్ । వేగంబనాహృదయంబులో వివ రింపదాసునిజేయుమీ । నాగంబరాధరసన్నుతా నారాయణా నారాయణా॥ ౧॥ భువినేనుమీపా దాబ్జములొప్పగడంగలేవయ్యకృష్ణమా । భవమ్ము నీకృపజూడుమిదశజన్మధారణకారణా । రవితేజ మంగళమూర్తివో రఘువీరనారదవంద్యతా । నవ మోహనాభవభంజనా నా॥ ౨॥ పలుమారునీశుభ నామముల్పఠనంబుసేయగనేరనే । కులహీనుని బహుపాప సంకలితుండనైతినినీవునా । వలనేర మెన్నగనేమయావసుదేవనందనకృష్ణయో । న నుగన్నవాననుబ్రోవవే నా॥ ౩॥ పరులందునేనప కారినైబహుపాపసంకలితుండనై । సురవంద్య దేవరపాదముల్ హృదయంబు నిల్పకజాలనే । నరులందుయెందునుగాని వాడనినన్ను కన్నడ

సేయకే । నరసన్నుతానను బ్రోవవే నా॥ ౪॥ సు
రులందు కొన్నమృతంబులో సులభంబులిచ్చిన
గానినా । యిపొంది రోగములెల్లదాయనమం
చు భంగినియేనునే । నిరతంబునీభజనంబులై నిజ
భక్తియుక్తినినిన్నుదా । నరసన్నుతా నను బ్రో
వవే నా॥ ౫॥ జగమెల్లనీయుదరంబులో జనియిం
పజేసినవాడవై । యగడొందుబుద్ధినికొందరైయ
నుగణ్యబుద్ధినికొందరై । తగపెంచనీవును పక్షపా
తము కుక్షివాడనుకొందరై । నగధారణాయిది
యేమయా నా॥ ౬॥ కాయంబునిల్కడనైననిన్
కడువేడుకొందురుమిక్కిలిన్ । తోయంబుతేలిన
బుగ్గలైదొరకొన్నసంసారాంధులై । మాయంబు
జేసినమిమ్ముదా మదినెంచువారికినేడుదా । న్యా
యంబులెట్లువునోకదా నా॥ ౭॥ నెలకప్పుమల్లెలు
జారగానెలవంక పెన్నుదురందుదా । పరికింప
ముత్యము బింధులైపలుమారుపై జమరింపగా । సు
రతంబులిమ్మనవారిలో సుఖలీలనుండితి వీనయా ।
నరకంబులో నను దోయకే నా॥ ౮॥ జననంబు

తాటయుజేసియున్ జనరక్షకర్తవునీకుదా। ధన
ముందుకొందరు రక్షలైతగనిన్ను పూజలుచేసి
యు। న్ననువొందనెమ్మదినుండి నందతిభక్తిమ్రొ
క్కుదురిప్పుడు। నన్నువంటిదీనుని బ్రోవవే నా॥
౯॥ హరిపుత్రువ్రాసినవ్రాతకున్నధికంబు లేదని
యందురే। పరికింపకౌశికుడాదిగా బహుసంయ
మీశ్వరులందరుం। ధరయందు నీకృపగల్గియుంచ
పముందునెప్పుడునుందురే। నరనన్నుతానునుబ్రో
వవే నా॥ ౧౦॥ గాయత్రిసంధ్యలు హోమము
ల్ గంగాదియాదిగనుండునా। తోయంబులాడగ
మిక్కిలిందోషంబుబోవునె యేమయా। నీయా
త్రచింతలు హోమముల్నిజతీర్థయాత్రలు మం
త్రముల్। న్యాయప్రకారముసేయవా నా॥
౧౧॥ పదమందు పద్యములందునీ భజనంబుసే
యగనేరనే। యెడయందుదేలిననిన్ను దాహృ
దయంబు నిల్పగలేనునా। మదమందుపామరు
డైననా మదినుండినన్నును బ్రోవుమీ। నదియం
బుధారణనన్నుతా నా॥ ౧౨॥ శరగోపధారణి

లేదునీ సనిధాన మెన్నడుజూడనె । కడునీదుభ
క్తులలోన నొక్కరిలోను భాషితుగానినా । యెడ
మీదురాదయ బ్రోవుమీయితరంబు లేదిదిసత్తమే ।
నడయాడు నిగ్రహమోన మో నా॥ ౧౩॥ ఫల
మూలదేహాని నేలుదాబహుదుర్గుణాధిపు నేనుదా ।
యిదియెల్లసేవయిచ్చినీ హృదయాన కోపము
రెంచిన । న్నవగూడగర్భమునందు మూగనుగో
న్న యెవ్వరుబెంతురో । నవమోహనా దయజూ
డవేనా॥ ౧౪॥ నెలకొన్న కాముకమూఢులైనిను
యెంచలేదని నన్నుదా । చులకంగజూడకు
మయ్యనీవో సురరాజవందితపాదనే । పలుకంగ
వింటివోలేక నీబహుభూక్త సందడినుంటివో । నను
గన్నవానను బ్రోవవే నా॥ ౧౫॥ మనసీత జేసిన
చింతలైమదిగోరనుండియుమిక్కిలిం । జనదూష
కత్వముగాగనే చరియించు నేరములన్నియుఁ ।
యినమంచుభంగియు జేసి నా హృదయంబునం
దున నుండియుఁ । ననువంటిదీనుని బ్రోవవే నా॥
౧౬॥ మొలనూలుఘంటలుమిక్కిలిఁ మురిపెంపు

నవ్వులచందముల్ । ఘలుఘల్లుఘల్లును నందియ
ల్వడి మ్రోయనాడిన పాదముల్ । యిలనిన్ను
జూడగ వేడుకై యిదినిన్ను వెండియు నేనయా ।
ననుగన్నతండ్రి విరావయా నా॥ ౧౭॥ ఇలజీవనం
బులనేనుదా యెన్నెన్ని సత్యము జేసినం । గల
వారిసొమ్ములకందునే కడు ద్రోహచింతలు జేసి
నన్ । పలుమారునే భజనంబునా పరిహాసవానా
నియెంచితిన్ననుగన్నవానను బ్రోవవే నా॥ ౧౮॥
అనువొందనాసురబంతినీ యమృతంబులియ్యగ
జూచినన్ । వెను రక్కసాధము డప్పుడా ప్రియ
మొందియుండిన వేళలన్।ఘనచక్రదారలగొట్టి
యున్ ఘనుడైన దేవరయిప్పుడు । నన్నుజెందు
పాపము ద్రోలవె నా॥ ౧౯॥ తెలియంగ నీభజనం
బులే తెలియంగజెప్పినవారికిన్ । గలదన్న వేళల
యందునే కడనుండి యవ్వలనుండగా । తొలి
బుద్ధి దోచిన చిత్తుడై దొరకర్త డప్పుడు నేన
యా। ననుగన్నవా నను బ్రోవవే నా॥ ౨౦॥ అగ
డొందు సుజ్ఞానత్వమున్ డతిదూర మెక్కగలేను

నే। మగుడంగసుజ్ఞానంబుదా మరియందలంబున
నీపురన్ । బొగడంగ నీభటుడౌదునాపురుషోత్త
మోత్తమ కేశవా। నగధారుణా దయసేయవే
నా॥ ౨౧॥ అలపాండుపుత్త్రులదేవిని న్నభయం
బువేడిన యప్పుడున్ । దిలకించి మానము గావ
వా దృఢచిత్తవైభవమియ్యవా। యిలనేనుకోరి
నకోరికల్ యిదినీకుయిచ్చుట పెద్దయే । ననుగ
న్నశ్రీహరి రోహరి నా॥ ౨౨॥ చలమొప్పనుబ్బ
సవాంధికిన్ సహాయింపజాలను నేనునా । వలని
ప్పుడేమియునేర మో వసుదేవ నందన జెప్పవే।
యిలతప్పుకార్యము జేసి నాహృదయంబు వేడి
తినిప్పుడు। న్నాపెన్నిధాన మెబ్రోవవే నా॥ ౨౩॥
పాపంబు లొట్టియు నెట్టివో పరియంగితంబులు
నెట్టివో। కోపంబు రూపక మేననే కుటిలాత్మ దే
హానినేనయా। ఆపన్నరక్షితుడైననిన్నభయం
బు వేడితినిప్పుడున్ । నాపెన్నిధానను బ్రోవవా
నా॥ ౨౪॥ తొలికర్మబంధము లెల్లదా దొలగంగ
జేసియు నిప్పుడు। న్నిలజన్మమాటయు జేసియు

న్నిలయొక్క నేరములెంచదో । పలుకంగ నేమి
యుజేయునాభవపుణ్యకర్తవునీవుదా। ననుగన్న
శ్రీహరిరోహరీ నా॥ ౨౫॥ మదినెంచు కార్యము
గ్రక్కునామరియున్న వేళలయందురా । కొండ
పైన వేళలయందునీగుణమెంచి మెత్తురుగాననా।
హృదయంబునెట్టిదొయైన నీహితమెంచి నన్ను
నుబ్రోవవే । నదియిందుధారుల సన్నుతా నా॥
౨౬॥ ఫలమేమి యీనరజన్మమో బహుకాననం
బున నేనుదా। నెలకొన్న పక్షికులైన యీనిజవృ
క్షపుట్టుకలైనవా । పొలుపొందు పుట్టుకపుట్టు కే
పురుషార్థమేమియు గల్గెనో। ననుగన్న వానను
బ్రోవవే నా॥ ౨౭॥ పనిబూని నాభయభక్తిచేభ
జనంబుజేసినవత్తువో । యనువొందనీకును దా
సుడై యతినిష్ఠనుండినవతువో। మనుజేశ నావర
మియ్యవే మదినిన్ను సన్నుతిసేతును। ననుగన్న
తండ్రివి రావయా నా॥ ౨౮॥ ఇలనాలుబిడ్డలు
సంపదల్ యిదినీవుగల్గగజేసియు। న్నెలకొన్న
భక్తిని నిన్ను నేనిజమెంచ గాదనునన్ను నా।కలి

నేఘనమార్గ లక్షణయుక్తమై । వివరింపజాలని
నిన్నుదా వినుతింపజేసిన దేవదా । భువినిన్ను
సత్కృపులాదిగాబుధులెల్లమెచ్చగసేయరో । నవ
మోహనాభపభంజనా నా॥ ఇభచర్మధారణనీవు
దా యినమర్త్యసంభవునీవుగా । శుభవేదసార
మునీవుదా సురకోటిముఖ్యుడునీవుదా । అభ
యంబులియ్యను నీవుదా అఖిలాండకోటియునీ
వుదా । నభమండలాకృతవోన్న మో నా॥ తలి
తండ్రిబాసిన బాలులం దయబ్రోవ కర్తవునీవు
దా । యలబంధువర్గము లేమికిన్నను నొందనుండి
ననీవుదా । యిలదీనరక్షక నిన్ను నాహృదయం
బునుంచిన నేనయా । ననుగన్నవానను బ్రోవవే
నా॥ తగవందుధర్మము లందుదాతగ నీతిదోచిన
వాడనై । పగలందుమన్మథకేళిలో బహులీలనుం
డినవాడనై । జగమందుపాపపుబుద్ధినీ జనియించి
యుండిన నేనయా । నగధారణానను బ్రోవవే నా॥
ఇరవొంద నాహృదయంబులో యితరంబుకోరి
కెలేదునీ । చరణంబులేమదిమిక్కిలిక సౌభాగ్య

సంపదలంచునే। నెరనమ్మినానిదిసత్యమేనిజమెంచి వేడిననేనయా।నరసన్నుతానను బ్రోవవే నా॥ శిలజేసి మ్రొక్కుటల్లెల్లనా జనచింతచంచలమే కదా। కలదన్న ప్రేమనుభక్తి యోఘనులైనసజ్జనులందుధా। నెలకొన్న దేవుడగాన నేనిజమెంచి వేడిననేనయా। నరసన్నుతానను బ్రోవవే నా॥ వటబీజమెంతయు దారిచే వటవృక్షబాహుళ్యుచెంతనీ। నిటమీదనీకడనన్నిసుమంతజూచినజాలునే। నటుగానినీవనినేడునే నభయంబువేడిన నేనయా। నరసన్నుతానను బ్రోవవే నా॥ పనిబూని వానయు లేమిడిన్ పయిరెండివాడిన యప్పుడున్। ఘనమేఘధారలుగల్గియున్ గడుసంభ్రమించినరీతిదా। నినువేడుకోరితెలిప్పుడు న్నిజమాటజేసియుమిక్కిలి। న్నను బ్రోవవేహరిరో హరీ నా॥ ముందెందుబుట్టినవాడనో ముదమంది భక్తుల యిండ్లలో। యెందెందు వ్యాపకలీలుడై హితబుద్ధినుండినవాడనే। యందెందుకప్పుగాని నిన్నభయంబువేడితినిప్పుడుం। నందందుమీకృ

పజూడుమీ నారా॥ రేపల్లెనందునీయింటిలోనీవు
న్న వేళలయందునీ । రూపెల్లదాల్చియుమిక్కి
లి౯ రూఢింపముద్దులబాలుడై । మాపెల్లగొల్లల
యిండ్లలోమరిపెన్నదొంగయునీవుదా । నాపట్ల
నీనిజమియ్యవా నా॥ పనిబూనిరాదయుమిక్కిలి౯
పశిబండితాటయుపక్కలో । నినుపవ్వళింపగజే
సియు న్నైలకొన్న ప్రేమయునీవుదా। చనులంటి
కూడితివేకదా సర్వజ్ఞమూర్తియొునీవుదా । నను
వంటిమూఢునియందుదా నా॥ తలచిక్కువాపిన
నిక్కిలి౯ తలపోయదుర్గంధంబులై । నెలకొన్న
చీమిడినెత్తురున్నిజధారరోతలపుట్టుకల్ । యిల
కోమలాంగుల యిండ్లలో కాపుండి యుండిన
నేనయా।ననుగన్నవానను బ్రోవవా నా॥ పరవాసు
దేవుడునీవుదాబహురూపధారివినీవుదా।నిరతంబు
నీభజనంబులైనిజభక్తవత్సలనీవుదా। అరయంగవే
దమునీవుదాఅఖిలాండకోటివినీవుదా । నరసన్ను
తానను బ్రోవవేనా॥ పరచింతబాసినమిమ్ముదాభజ
నంబుజేసిన వారిలో । దమకించివచ్చిన బ్రోవవే

దృఢచిత్తుపై ధవమియ్యవా। కరమొప్పదేవరపా
దములగరుణింపనన్ను బ్రోవవా। నరసన్నుతా
నను బ్రోవవేనా॥ అనువొందనంబరవీథిలోయటు
వచ్చుగంధర్వుండుదా। వానరంగనీవ్రుదుదోసి
టఁవుమియుంగనీవునుమిక్కిలిఁ। పనిబూని ద్రో
చిన దేవరాథయుభక్తినిన్ను వేడగా। ననువంటి
దీనుని బ్రోవవే నా॥ మరికోరిచేసిన పాపముల్తరి
వీడదందుసపెద్దలుఁ। కదనంబులో నొకపెద్ద
యాఘనభీష్మయోధులజంపని। పదియందుబాసి
న దేవరా యదియోటమికునుచెల్లునా। నదియం
దుదారుణ సన్నుతా నా॥ కఠినంబుగూడినవా
చేకడునమ్మరానిదిదేహమో। పుడమందుపుట్టుక
జేసియుపురుషార్థపైఖరియేమినా। యెడమందు
పాపముబాసిని హితమైన దాసుని జేయుమీ। నడ
యాడువిగ్రహమోనమోనా॥తలపోయసంసా
రాదులెతగుభక్తితోకులుమెత్తనె। యిలచంచ
లంబులనున్న వాహృదయంబునిల్పగనన్నునా।
వలనేరమెంతయు బాసినీవరభక్తదాసుని జేయు

మీ। నగన్న శ్రీహరిరో హరీ నా॥ నెలకొన్న క్రూ
రము చేత నీనెడ చింతనుండిన వారిలో। కలయంగ
నీకృపనన్ను నాయెదురందు నీవునుదానుదా। క
లపాపపుణ్యములజన్ముడై కడునిన్ను వేడిన నేనయా
నను బ్రోవుమీ దయజూడుమీ నా॥ ప్రాయంబుచి
న్నయు వాడపై బహులీలలుండిన వేళలꠛ। మీ
యన్న నోరునుజూచి దుష్టమిచ్చుంగ జేసి య
ప్పుడు । నాయన్న లోకములన్ని నీవపుడుండ
జూచిన దేవరా। నాయందునీదయజూడుమీ నా॥
పనిబూని నీభజనంబులే పఠనంబు జేసిన వారిలో।
నినురమ్ము పొమ్మనువారు దానిజమందు దెల్పినగా
నినే । మునునీవు నారదు వెంట నేముదమందునీవు
నువుండవే । ననువంటి దీనుని బ్రోవవే నా॥ ఇరవం
దభక్తిని నిన్ను దాహృదయంబు నిల్పిన వారిలో।
పరికింప పాండవ పక్షమైనదకొండు క్షోణులజం
పవా। మరినిన్ను నమ్మిన కర్మముల్దొలగింపవో నను
గావవే। నరసన్ను తానను బ్రోవవే నా॥ మునుజే
సినా క్రనికానలꠛ మరిసంచరించిన వేళలం।బనిబూని

బోయదియెంగిలౌ ఫలమందితృప్తియు బొందియ
న్। ననువొందదానిని మెచ్చినీయభయంబు లిచ్చి
న నేవరా।ననువంటిదీనుని బ్రోవవా నా॥తనతల్లితం
డ్రియునన్ను దాకడు ప్రేమపెంచియుగాన నే।పని
బూని జేసిన పాపములు పరిహారమౌటయు సేయనే।
నినునీవుకర్తవుగాగనే వినుతింపబూనితి నెంతయో।
ననుబ్రోవవే హరిరోహరీ నా॥ధరనిన్ను పూజలుసే
య పెద్దలునవ్వుకొన్దురు యేమినే।నరయంగపుష్ప
ములందుదాననువొందవారియు బ్రోవవే। నిరతం
బునీపదపద్మముల్ నెరనమ్మి వేడిన నేనయా। నరసన్
న్నుతాహరిరోహరీనా॥ నీకన్న దేవుడులేడునే నె
రనమ్మివేడితినిన్నుదా।చేకొన్న ప్రేమను శ్రీమనో
శ్రీహస్తలాంఛనమియ్యవే। రాకున్న నిన్నును
విడుదునో రాధామనోహరనీవున। న్నాకొన్న
వాడవెరావయా నా॥ మునువేడలేదనినీవుమాఘు
లుచరంబులెంచినవాడవో। నినుగోరుపెద్దలుచిత
ముల్ నిజమెంచునేరనినిన్నుదా। అనుమానసం
గతులందుదా అభయంబులియ్యక నుందురా।

నను బ్రోవవే హరిరోహరీ నా॥ ఛందంబులక్షణ
యుక్తమైనమకూటపద్యములందునే । నందంబు
లేర్పడజెప్ప నేనర్హుండగాననిదేవరా। నిందింపగా
శతకంబులో నిజమూర్తిపంతములందుమీ । రం
దంబుమీరగ బ్రోవుమీనా॥ దాపున్న పెద్దలకెల్లనీ
దయచేసిపల్కియుమిక్కిలిన్ । రూపెల్లపాపము
దేహమేరూఢించియుండిననేనయా। యోపుణ్యా
మార్గములెల్లమా యేకాదశీఫలమియ్యవే । నాపు
ణ్యమూర్తివిధానమోనా॥ రేపల్లెవాడనునీవుదా
నిజమున్నదిన్నెలలోదనున్ । రూపెల్లజూడగ
మిక్కిలిన్ రూఢించివేడితిరిప్పుడున్ । నాపన్న
రక్షకరావయా హరికృష్ణనీవునురారయా।నాపె
న్నిధానమరావయానా॥ చెలమద్దికాయలునందె
లుం చెలువందపాపటమిక్కిలిన్ । రవితేజమిప్పు
డుమేనునీరాజిల్లునీవును మెల్లనె। భువిదోషముండి
నరీతిన్ పాలుపొందనన్నునుజూడగా । నవనీత
చోరుడరావయానా॥ ఇలదేవదేవుడనీవుదాపిత
దానకర్తవునీవుదా । కలడన్న చోటనునీవుదాకరు

ణాపయోనిధినీవుదా । నెలకొన్న భక్తిని నిన్ను
దా నెరనమ్మివేడిన నేనుదా। ననుగన్న వానను
బ్రోవవే నా॥ గిరిలందుతోడనునీవుదా గ్రహమం
దుతోడను నీవుదా । నరయంగ కారణభూముల
న్నటువచ్చుతోడను నీవుదా । నిరవొందనాభజ
నంబులోయిదొవచ్చినానని రావయా।నరసన్ను
తాహరిరోహరీ నా॥ వరదేవుడై నరజన్మమై వసు
దేవపుత్రుడవైనమా । ఝిలవందనందునియింటి
లోయిలనిచ్చనుండినయెప్పుడున్ । పదికింపనీవు
సుభక్తులఙ పాలించ దేవుడవైనమా। నరసన్నుతా
నను బ్రోవవేనా॥ ఇలజన్మమొాటయు నేనుదాయె
న్నెన్నికర్మము జేసినా। పలుమారునీబుధులందు
నేబహుపాపకష్టకుడైనదా। నెలకొన్న ప్రేమను
నన్ను దానిజభక్తు నొాటయుశాయరే। ననుగన్న
శ్రీహరిరోహరీ నా॥ పరచింత లేకయె మిమ్ముదా
భజనంబు జేసినవారిలో । తిరుకచ్చినంబిని బ్రో
వవాదృఢచిత్తవైభవమియ్యవా। కర మొప్పదేవ
రపాదముల్ కడుభక్తివేడిన నిప్పుడుఙ । నరస

న్నుతానను బ్రోవవే నా॥ కలికాలజనమ్ములందు
దా కపటంబునిచ్చలమేకదా। వెలయంగనీశుభ
నామములన్ వినుతించువారలయందుదా। నెల
కొన్న దేవుపరించునే నిజభక్తివేడిననిప్పుడున్।
ననుగన్న వానను బ్రోవవేనా॥ కనుసన్న జేసియు
మిక్కిలిన్ గడుజారపయ్యోదనుండునా। జను
లందుజూపులునిల్పనా తరిచింతవిభ్రమ మౌట
యున్। పనిబూనిశయ్యకుబిల్చనా పరభామ
లోలుడనేనయా। నను బ్రోవవేహరిరోహరీనా॥
మదినేననామదిగోరి నీమహిమెల్ల సన్నుతజేసి
నా। కరువెల్లతీరగమిక్కిలిన్ కొనియాడజేసిన
నన్నుదా। నిరతంబునీపతిపద్మము న్నిజభక్తి
యుక్తినిసేయవే। నరసన్నుతానను బ్రోవవేనా॥
తొలిపాండుపుత్రులనెల్లదా తొలికర్మబంధము
వాపుచు। న్నిలనీవదిక్కని యుండిగాహితవెంచి
యుండినదేవరా। నెలకొన్న భక్తినినిన్నుదానిజ
మెంచ వేడిననిన్నుదా। ననుగన్న వానను బ్రోవ
వేనా॥ నినువేడుభక్తులలోననే నిజభక్తుడౌటయు

జేసినా। కనులందుదేవరపాదముల్ కడుమోహా
ముంచియుమిక్కిలిన్।ననువొందసేయవెతంద్రి
శ్రీహరిలోకదక్షుడ నీవుదా । ననుబ్రోవవేహరి
రోహరి నా॥ తెలివొందనీభజనంబులై ధృఢమెం
చియుండిన వేళలన్ । చలపోర చంచలబుట్టినా
సమయంబుతోచకయేమినా।వలనేరమేమనినా
మదిన్ వలదయ్య చంచలబుద్ధులం । ననుగన్న
వానసుబ్రోవవే నా॥ పలుమారు వేడినగాననే బ
హుమాయలందున దేవరా। యిలనేనుకోరినకో
రికల్ హితవొందయెన్నడుగానినే । తలపోయి
నీనిజభక్తుడై ధరణాదిసన్నిధిలోననే। నెలమింపు
దాసునిజేయుమీ నా॥ అలఘాలలోచను నీవుదా
యమృతంబు జిక్కినయప్పుడున్ । నెలకొన్న
మంటలుమీరుదా నిజకాలకూటము మీతడే। తల
పోయనీనిజభక్తుడై ధరనేనుజేసిన పాపముల్ ।
ననుగన్నవాయిదిబాపుమీ నా॥ వనమాలికాభర
ణంబులతో వరశంఖచక్రబలంబులతో। ఘనరత్న
కుండలకాంతితో గరుడేంద్రవాహానరూఢవైయ

నువందవేగమెవచ్చి నీనభయంబు లియ్యవెదేవ రా । ననుగావుతండ్రివివేగమే నా॥ మునునీవున న్ననునీవుదా ముదమందినుండిననెల్లదా । వన రించుమాత్రముటెట్టిదో వుపదేశమిచ్చినగానసే। పనిబూనినీనిజమంత్రమే పఠనంబుజేసెదనయ్యవో । ననుగన్నవానను దెల్పవే నా॥ తెలివొంద నీనిజనామముల్ దృఢమెంచనేరను నీవునా । పల నుండుకర్మము బాపనో వసుదేవనందన యెప్పు డుఁ। చెలువందనీ నిజదాసుడై చెరియించ కట్టడ శాయవే । ననుగన్నశ్రీహరిరోహరీ నా॥ రేపలె లోపలగోపికల్ రతిప్రేమకూటమిగూడిరి।ర్యావశ్ పారవృత్తినినుండగా నాపాలవారలయందునా । షోగొట్టజేసినస్వామివో గోపాలముద్రనినిన్ను నే। నాపాలనీదయజూడుమీ నా॥ పగకొన్నవారి కెనేనుదాపలుమారు వేడినమిక్కిలిఁ। తగమెచ్చి సమ్మతి నిత్తురే ధరయందుబుట్టిన వారలుం। ఖగ వాహనామరినిన్నునే కడువేడుధీరుని నేనయా। నగధారణా నన్నుబ్రోవవే నా॥ నీ పాదపద్మములం

దుదానెరనమ్మియుండినవారికిన్ । పాపాలులేదని వేదముల్ పలుమారుబల్కుచునుండునే । గోపాలమాధవనిన్నునే కొనియాడి వేడితి నేనయా । నాపాటుమీదయజూడుమీ నా॥ పరికింప నాదను దేహమున్ పలుమారు నుబ్బస వ్యాధికిఙ్ । ధరియింపజాలక నిన్ను నేతగుభక్తి వేడితినిప్పుడుఙ్ । కరమొప్పరోగముబాపుచుఙ్ కరుణించినన్నును బ్రోవుమీ । నరసన్నుతా. నను బ్రోవవే నా॥ భువియందు నామది భేదముల్ తన నామకీర్తనసేయగా। రవితేజ నామదిమిక్కిలిన్ భవరోగ వైద్యుడు నీవనిన్ । భజనంబుజేసిన నిప్పుడుఙ్ రంజిల్ల శాయవె తంద్రివో। నవమోహనాభవభంజన నా॥ నినునమ్ము భక్తులకెల్లదా నిజమైన దేవుడు నీవుదా । కనులందుజూడగ లేదునీ గరుడేంద్ర వాహన రూఢవై। యనువొంద వేగమె రావయ యభయంబులియ్యగమిక్కిలిఙ్।నను బ్రోవవేహరిరోహరీనా॥ తలపోయ నామది నుండు మాధవుడైన కృష్ణుడు నీవుదా। చిలపోరురోగముపీడునా సంజీవనగాని నె

నీవుదా। యిలనీవెదిక్కనియెంచి నా హృదయం
బులోనినునమ్మినా।ననుగన్న వానను బ్రోవవేనా॥
రోగంబుచేమది మెత్తనైరూఢించి వేడిననిప్పుడున్।
వేగంబెనాదునురోగముల్ వీడంగ జేసిన నేనయా
భోగేంద్ర వందితపాదనై భువినందు భక్తుడనౌదు
నే। నాగాంబరాధర సన్నుతా నా॥ ఇలయందు
నీకథయందు దాయితిహాస వేదములందుదా।పలు
మారునీ పరిపాలనల్ ఫలమెల్లజెప్పగ నేనుదా।
తిలకించిదేవర పాదముల్ దృఢమెంచి వేడితినిప్పు
డున్। ననుగన్న వానను బ్రోవవే నా॥ తెలివొంద
మిక్కిలితేజమై శేషాచలంబునునీవుదా। నెలకొ
న్న చెంగమనాయకా నినుసన్నుతింపగ నేరనె।
కులదైవ మేమరిమిమ్ము మీకృపనేలుదేవుడవైన
నున్।ననుగన్న శ్రీహరిరోహరీనా॥నీదాసులైనను
బంటులైనను వేడపెద్దలుయెందుకే। వాదాడుపా
వనిగానినా వలనందు నేరము లేదయా। వాదాగ
మంబులునిన్ను దానినుతింపజాలరు వేణులో। వో
దారసన్నుత వోమహా నా॥ ఇలయందు లోభుల

గూడినా హృదయంబుచంచలమైనమా। వలనుం డుదుర్గుణమెంచగా వలదంచుమాధవ కృష్ణనే। పలుమారునీపద పద్మము ల్భజనంబుసేయగనేరనే। ననుగన్న వానను బ్రోవవే నా॥ లోకంబుదేవుడునీవుదాలోకంబులోకులువారుదా। లేకున్న నేనుతియింతుగా నిజమొందదేవుడునీవుదా। చేకొన్న ప్రేమనునీవుదా శ్రీమత్తులోలుడ నీవుదా। నాగంబరాధరసన్నుతా॥నా॥ ఇలతేజముల్ వటపత్రమై యిభరాజరక్షిత నీవుదా। యిలమీదనే శయనంబులై యఖిలంబు లేలిన దేవదా। వలనేరమేమని వేగమె వరమియ్యలేమయనీవుదా। నిలనిల్వదేవా నమోనమో నా॥ ఆత్రేయగోత్రము వృద్ధియో ఆదూరియెంబెరుమాళ్ళుకుల్। పుత్రుండుకృష్ణుడు మిక్కిలిల్ పొగడంగదేవర పాదముల్। నిత్యంబుగావరమియ్యవా నిజభక్తినీదయశాయవే। నరసన్నుతా నను బ్రోవవే నా॥ పలుమారునీభజనంబులే పఠనంబుచేసినవారికిల్। కులగోత్రవృద్ధియు మంచి సద్గుణపుత్రవర్గములి

య్యావే। పిలసిల్లుచుందురుమిక్కిలిꣳ విజయం
బుచేకొనియుందురో। ననుగన్న శ్రీహరిరోహరీ
నారాయణా నారాయణా॥ ౧౦౦॥

పెద్దనారాయణశతకము,

సంపూర్ణము.



అమెరికꣳ డైమండు ముద్రాక్షరశాల, చెన్నపురి. 22-4-38, 2000.

గొం చేతకా శైవల్యమును

# మహామంత్ర రహస్యము మర్మశాస్త్రము.

## (యంత్ర మంత్ర సహితము)

ఇది రెండు భాగములుచేరి యంత్రమంత్ర సహితముగా అచ్చువేయబడిన గొ. మంత్రగ్రంథము ఇందు ప్రతిమంత్రంబునకు నష్టకర్మ విధాయకంబు యేర్పాటుకు మంత్ర సహితంబుగా నుండునది. ఇవి యితర మంత్రగ్రంథమువలె గాక మంత్రశాస్త్ర ప్రకారంబున ఋషి, బీజము, శక్తి, కీలకము, వినియోగములు దెలుపంబడి యంగన్యాస కరన్యాసములలో, ధ్యానమంత్రములలోను, కవచం, తర్పణము, హోమము, మూల మంత్రము, సంకల్పము, గాయత్రి, క్రమము మున్నగునవి, ప్రతియంత్రమునకు విమర్శగా జెప్పబడియున్నది.

ఇందు జెప్పబడియుండు వధిష్టాన దేవతలు:—మలయాళ మహామంత్ర యోగీశ్వరులు, విఘ్నేశ్వరుడు, ప్రసన్నవిఘ్నేశ్వరుడు ఆధారగణపతి, హనుమంతుడు, భేతాళుడు, గోపాల, శ్రీషణ్ముఖసుబ్రమణ్యం, శ్రీనీలసరస్వతి, నరసింహస్వామి, భూతము బ్రహ్మరాక్షసి, జడలముని మొదలగువాట్లను పోగొట్టుటకు, గ్రహములు తోలుటకు, బాలగ్రహదోష నివారణ, పశుపతి, ఇంద్రవుపాసనా, జగన్మోహిని, కరాళభద్రకాళి, నలుప్రక్కలు వ్రాయవలసిన యంత్రము, కార్యసిద్ధ్యర్థమున కెరలుకట్టువిధము, కుభేర మహాయంత్రము, సిద్ధివినాయకుడు, జగన్మోహన, తీక్ష్ణదంష్ట్ర కాలభైరవ రూపము, మలయాళభగవతీ, నవగ్రహయంత్రము, సూర్యగ్రహ మోహన వశీకరము, చంద్రగహయంత్రము, అంగారకయంత్రము, బుధగ్రహయంత్రము, బృహస్పతి యంత్రము శుక్రగ్రహ పూజాయంత్రము, శనిగ్రహయంత్రము, రాహుయంత్రము, కేతుగ్రహయంత్రము, రజస్వలయంత్రము, వటవృక్ష యక్షిణి, కర్ణయక్షిణీ, వశుశాదేవి, శ్రీవారాహీ కరక రాజరాజేశ్వరీ వలుబడి ముకోణయంత్రము మున్నగు విషయములు గలవు.

రెండు భాగములు చేరినది 2-8-0 పోస్టేజి 0-8-0

# సకలసర్వగుణ అదృష్టదీపిక

జ్యోతిషశాస్త్రమందరికి ముఖ్యముగా కావలసినది. ఇందు ముహూర్తభాగము, లగ్నభాగము, దశాభుక్తిభాగము, హస్తభాగము, స్త్రీభాగము, ఋతుభాగము, పురుషభాగము, ఉత్తమ మధ్యమభాగములు, ఆంజనేయప్రశ్న, రామప్రశ్న, శ్రీరామ సీతా అధూధచక్రము మొదలగు విషయములు గలవు. వెల 1-0-0 పోస్టేజి 0-8-0

వెస్టువార్డు అండు కంపెని, చాకలపేట మదరాసు-21